# ★ "చండీరాణి" సమీక్ష ★



'చండీరాణి' నిర్మాత రామకృష్ణ.

క్రిందటి నెల 28 వ తేదీన భారతదేశ మంతటా విడుదలయిన భరణీవారి "చండీరాణి" భారతీయ సినిమా చరిత్రలో ప్రత్యేక స్థానం ఆక్రమించుకున్నది. మూడు ప్రధాన దేశభాషల్లో ఒకేసారి తయారు కావడం, మూడు భాషల్లోనూ ఒకేసారి విడుదల కావడం, ఒక స్త్రీ తార కథ, దర్శకత్వం వహించడం, ఆ తారే రెండు ప్రధానపాత్రలు ధరించడం- ఇవన్నీ "చండీరాణి"కి ప్రత్యేకత ఆపాదిస్తున్నాయి. ఈ కారణంవల్ల ఈ చిత్రం దాక్షిణాత్య సినిమా పరిశ్రమకూ, ముఖ్యంగా తెలుగు పరిశ్రమకూ గర్వకారణమైనది.

"చండీరాణి"కి కథారచన, దర్శకత్వం భానుమతి; నిర్మాణం, ఎడిటింగ్ రామకృష్ణ; పాటలు, మాటలు సముద్రాల; ఫొటోగ్రఫీ సెల్వరాజ్; సౌండ్ కోటేశ్వరరావు; సంగీతం సి. ఆర్. సుబ్బరామన్, విశ్వనాథ్; కళ శేఖర్. భానుమతి, ఎన్. టి. రామారావు, రంగారావు, రేలంగి, విద్యావతి, తులసి, హేమలత, దొరస్వామి, అమర్‌నాథ్, మున్నగువారు నటించారు.

వీరసింహుడనే రాజా ఒక పేదపిల్లను మోహించి వివాహం చేసుకుంటాడు. ప్రచండుడు అనే సేనాపతి కూడా ఆమెనే మోహించి వున్నందున, ఆమెను తనకు దక్కనివ్వలేదనే కోపంలో రాజుపై పగ తీర్చుకో దలుస్తాడు. రాణి గర్భవతియై కవల ఆడపిల్లలను కంటుంది. వెంటనే ప్రచండుడు దామెకు విషమిచ్చి చంపిస్తాడు. భార్యా మరణంతో మతి చలించిన రాజును ఖయిదు చేస్తాడు. విశ్వాసపాత్రుడైన మంత్రి కవలపిల్లలలో ఒకరిని ప్రచండుని చేతుల్లో వదిలి, దాసీద్వారా సురక్షిత ప్రదేశానికి పంపిస్తాడు. గెంటిన పిల్లను స్వయంగా కోటవెలుపలికి తీసుకు వస్తుండగా ప్రచండుడు చూసి, మంత్రిని చంపి, పిల్లను లాక్కుంటాడు. ఆ పిల్లను తన కొడుక్కిచ్చి వివాహం చేయాలనే తలపుతో జాగ్రత్తగా పెంచుతాడు. అడవికి చేర్చబడిన పిల్ల చండీ అనే పేరుతోను, అంతఃపురంలోని పిల్ల చంపా అనే పేరుతోను పెరిగి పెద్దవారవుతారు. చనిపోయిన మంత్రికొడుకు కిశోర్ కూడా పెరిగి పెద్దవాడవుతాడు. తన తండ్రి ఎలా మరణించిందీ, ప్రచండుడెలా రాజ్యం సంపాదించిందీ, తన్ను పెంచిన రామ్‌సింగ్ అనే వృద్ధుని ద్వారా తెలుసుకుంటాడు. రాజవంశాన్ని ఉద్ధరించడానికి దీక్ష పూని, అంతఃపురంలో చంపను, అడవిలో చండీని కలుసుకొని తన దీక్ష తెలియజేస్తాడు. చండీ, చంపా, ఇద్దరూ అతన్ని ప్రేమిస్తారు. కాని అతను చంపను మాత్రమే ప్రేమిస్తాడు. చండీ ఈ సంగతి తెలిసి తన ప్రేమ త్యాగం చేస్తుంది. ప్రచండుని దురాగతాలు అంతమొందించడానికై ప్రజా విప్లవం లేవదీసి ప్రచండునిపై దండెత్తుతుంది. అతనితో యుద్ధం చేసి చంపివేస్తుంది. కాని ఆ పోరాటంలో ఆమెకు కూడా గాయం తగులుతుంది. చెరలో వున్న తండ్రిని, మిగతా వారిని రక్షించి తను చనిపోతుంది. చంపా కిశోర్‌లకు వివాహం జరుగుతుంది.

ఈ చిత్రం అశేషం సామాన్య ప్రేక్షకులకు వినోదం, కాలక్షేపం కలిగించడమే అయితే, కొంతవరకు నెరవేరిందనే చెప్పాలి. మనస్సును కాసేపు నిద్రబుచ్చి, కళ్ళతో మాత్రమే చూసి ఆనందించగలిగితే ఈ చిత్రం తృప్తికరంగా వుంటుంది. సాధారణంగా మన జానపద చిత్రాలన్నీ ఇలా చూడదగినవే. ఆలోచించ సాగినకొద్దీ ప్రశ్నించ మొదలిడినకొద్దీ కథనిండా లోపాలు కనిపిస్తాయి.

పేదపిల్లను రాజుతోపాటు ప్రచండుడు కూడా మోహిస్తాడు. ఆమెను రాజా వివాహమాడుతానంటే బాధపడతాడు. అంత బాధపడినవాడు నిర్దాక్షిణ్యంగా ఆమెను చంపి, రాజును ఖయిదు చేస్తాడు. ఆమెను చంపి రాజుపై పగతీర్చుకోదలిస్తే ఆమెకు సంతానం కలిగేదాకా ఆగవలసిన అవసరం లేదు.

కవల ఆడపిల్లల మూలంగా కథకు కలిగిన ప్రయోజనమేమీ లేదు. చంప పాత్ర లేకపోయినా కథ సాగించడానికి వీలున్నది. చంప పాత్రను ప్రవేశపెట్టినప్పుడు, ఆమెకూ చండీరాణికీగల పోలికను పురస్కరించుకొని కథలో విచిత్రమైన సంఘటనలు ప్రవేశపెడితే బాగుండేది. దానికి ఈ పోలిక సరిగా ఉపయోగించుకోవడమే లేదు. చంప స్థానంలో చండీ ఉండడంవల్ల, ప్రచండుడుగాని, అతని కొడుకు ముకుందుగాని మోసపోయిందీ, నష్టపడిందీ ఏమీ లేదు. అలాగే, చండీరాణి పెద్దపులిని యుద్ధం చేసి చంపిన సన్నివేశం కూడా, మొదట ఆసక్తి కలిగించి, కథాగమనంలో పరిణామాలను దారి తీయకుండానే వృధా అయిపోయింది. చండీకి తండ్రి చెప్పిన రహస్యవాక్యం సంగతి కూడా చివరికి వృధాగా వదిలివేయబడింది. అడవిలో కోయదొరకూ చండీకి వైరం, కోయదొర చండీని పెంచిన దాసీని తగలపెట్టించడం వగైరా సన్నివేశాలూ ఇలాగే వ్యర్థంగా ప్రవేశపెట్టబడినవి. కథానాయకుడైన కిశోర్ పాత్రకూడా కథలో సాధించిన దేమీ లేదు. ఒక్క చండీరాణి పాత్ర గొప్పదనంకోసం మిగతా పాత్రలన్నీ బలా



ఫోటోగ్రాఫర్ : సెల్వరాజ్.

గౌరిని కష్టాలనుంచి గట్టెక్కించడానికి దేవకన్య అవతరించి, గౌరిని చందన రాజువద్దకు తీసుకువస్తూంది.
విజయావారి "చంద్రహారం" లో శాంతాదేవి, శ్రీరంజని.



కళాదర్శకుడు: శేఖర్.

ఇట్లాంటివి మినహాయిస్తే భానుమతి దర్శకత్వం బాగానే వున్నది. కోయకొండలోను, ప్రదంగుని తోను చండీరాణి చేసిన కత్తియుద్ధాలు టేకింగ్ దృష్ట్యా బాగున్నాయి. కథ వీలిచ్చినంతవరకూ చిత్రంలో సస్పెన్సు పోషించబడింది. భానుమతి రెండు భిన్న పాత్రలనూ రక్తివంతంగా పోషించింది. ఆమె అభినయం ఈ చిత్రంలోకల్లా "హైలైట్" అనదగినది. కిశోర్ గా ఎన్. టి. రామారావు, మూర్తీభవించిన విలన్ గా రంగారావు రాజుగా అమర్ నాథ్ సమర్థతతో నటించారు. రేలంగి హాస్యనటన ప్రేక్షకులకు కావలసినంత వినోదం కలిగిస్తుంది.

ఉన్న కొద్దిపాటలూ కర్ణపేయంగా ఉన్నాయి. కామెరామాన్ సెల్వరాజ్ ట్రిక్ షాట్సు జయప్రదంగా తీశారు. రాజభవనం సెట్ వగైరా కథా వాతావరణానికి బాగా తోడ్పడ్డాయి. చిత్రం పొడవుకూడా నేటి చిత్రాలకంటె తక్కువే ఉన్నది

కథా లోపం తప్పిస్తే, దర్శకురాలిగా, అభినేత్రిగా భానుమతికి "చండీరాణి" వ్యక్తిగత విజయం సాధించి పెడుతున్నది. ఈ చిత్రం ఇచ్చే ప్రోత్సాహంతో ఆమె ఇంకా మంచి మంచి చిత్రాలు తీయగలదని ఆశిస్తున్నాము. ★

## సినిమా వార్తలు

శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీవారి తెలుగు, తమిళ్ సాంఘిక చిత్రం "లక్ష్మి" నిర్మాణం దాదాపు ముగియవచ్చింది. అనుకున్న షెడ్యూల్ ప్రకారం షూటింగ్ జరిపారు. ఆఖరి సెట్టుమీద షూటింగ్ మిగిలివుందనీ, ఇంకా మిగిలిన పనికూడా ఈ నెలలోనే పూర్తి చేయగలరనీ తెలుస్తున్నది. అక్టోబరు ఒకటో తేదీకి తెలుగు చిత్రం విడుదల చేస్తారట. శ్రీ కడారి